
చి॥ కొండూరు కమలా ప్రసాద్ దంపతులు


చి॥ పాలతీర్థపు శ్రీనుబాబు దంపతులు


చి॥ కంటె శివకుమార్ దంపతులు

శ్రీశ్రీశ్రీ జగద్గురు సనారీవిశ్వేశ్వర స్వామినే నమః

# శ్రీశ్రీశ్రీ సనారీ వారి దీక్షా విధానము




సంకలనం : సనారీ మాలాధారణ కర్త, సెల్ : 92905 82110
బ్రహ్మశ్రీ సుగంధం సాయిబాబాచార్య సిద్ధాన్తి




## దీక్షాధారణ వివరములు

దీక్షాధారణసనారీపీఠం వద్ద సనారీ ఉపాసకులచే స్వీకరింపవలెను.
లేనిచో శివాలయం వద్ద అర్చకస్వాములచే స్వీకరింపవచ్చును.
మహాశివరాత్రి నాటికి 41రోజులుండేటట్లు
సనారీజయంతికార్తీకశుద్ధపంచమినాటికి 41రోజులుగా
సనారీకళ్యాణం వైశాఖశుద్ధ ఏకాదశినాటికి 41 రో॥ అగునట్లు ఉండాలి.

**దీక్షాకాలములు**

| | |
|---|---|
| 41రోజులు ఉత్తమము | 21రోజులు మధ్యమము |
| 11 రోజులు అధమము | 5 రోజులు అధమాధమము |

దీక్షాపరుల అవకాశాన్ని బట్టి స్వీకరింపవచ్చును. యింకనూ "మహాశివరాత్రి" పరమపవిత్రమగునది. పరమేశ్వరునకత్యంత ప్రీతికరమగుదినము కావున సాక్షాత్ పరమశివస్వరూపమయిన సనారీవార్ని మహాశివరాత్రికి అర్చించుట అభిషేకించుటచే జన్మ జన్మార్జిత కర్మలు నశించి అంత్యమున శివసాయుజ్యం పొందుదురు.కావున సనారీమాల 11 సార్లు ధరించిన వారికి మోక్షప్రాప్తికల్గుటలో ఎట్టి సందేహములేదు. అనేకజన్మలతపః ఫలంగాలభించిన మానవజన్మను సనారీవారి దీక్షతో ధన్యత గావించు కొందురుగాక! జన్మకోశివరాత్రియను పెద్దల ఆర్యోక్తి ననుసరించి సనారీ మాలాధారణతో "మహాశివరాత్రి జాగరణ" విశ్వనాధ అన్నపూర్ణాంబల ఏకనామంతో గడిపి మోక్షప్రాప్తి నొందుదురుగాక॥

**శ్రీశ్రీశ్రీ సనారీవారి దీక్షా నియమాలు:**

రెండుపూటలా స్నానం, పూజా నివేదన తప్పనిసరి
వీలైనన్నిసార్లు నిత్యంమూలమంత్రాన్ని జపించాలి.
మితభాషణ, అతి మౌనాన్ని పాటించాలి.
ధూమపానం, మధ్యపానం, మాంసాహారాన్ని వర్జించాలి
కామక్రోధాలను వీడి, శాంతంగా ఉంటూ సత్యాన్నే పలకాలి.
ఒకపూటభోజనం, భూశయనం తప్పనిసరి

పురుషులను సనారీయని, స్త్రీలను అమ్మా (మాతా)అంటూ పిలవాలి
సాత్వికాహారము, బ్రహ్మచర్యముతప్పనిసరి
స్త్రీలు పురుషులు తమకుగల దుర్వ్యసనాలు ఏదో ఒకటి వదులు కోవాలి.

**దీక్షా విశేషము:**

ఈ దీక్షను నియమాను సారం ఆచరించినవారికి, భూత,ప్రేత, పిశాచబాధలు, శత్రుబాధలు,ఋణబాధలు, ప్రయోగబాధలు తొలగి సర్వసంపదలుగలిగి యిహలోకసౌఖ్యములనుభవించి, అంత్యమున శివసాయుజ్యముపొందుదురు.

(ఉదయం నిద్రమేల్కాంచి రెండుచేతులను దగ్గరగా ఉంచి)

**అరిచేతులు చూచుకుంటూ**

శ్లో॥ **కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీః**
**కరమూలస్తితా గౌరీః ప్రభాతేన కరదర్శనం॥**

మాతాపితృభ్యోనమః శ్రీ గురుభ్యోంనమః అన్నపూర్ణా సమేత
విశ్వేశ్వర స్వామినే నమః

(అని ప్రార్ధిస్తూ పడకనుండి లేచి పాదాలు భూమిపై పెట్టునపుడు)

శ్లో॥ **సముద్రవసనేదేవీ పర్వతస్థనమండలే**
**విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే॥**

అంటూ భూమికి నమస్కరించి కనులకద్దుకొని కాలకృత్యములు తీర్చుకొని)

**సూర్యోదయసమయమున**

శ్లో॥ **బ్రహ్మస్వరూపముదయే॥మధ్యాహ్నేతుమహేశ్వరం**
**సాయం ధ్యాయే సదావిష్ణుంత్రిమూర్తించదివాకరం॥**

శ్లో॥ **గంగేచ యమునేచైవ కృష్ణాగోదావరి సరస్వతి**
**నర్మదా సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు**

(అంటూ ముమ్మారు జలమును శిరస్సు పై జల్లుకొని స్నానంచేసిన నదీస్నానం ఫలితంకల్గును).



**దీక్షావస్త్రాలు : బొట్టు మాలలు**

గంధపురంగు లుంగీ, తెల్లచొక్కా, ఎర్ర కండువా, మూడు విభూతి రేఖలు భ్రుకుటిని గంధంబొట్టు అందులో కుంకుమబొట్టు, రుద్రాక్ష తులసీమాలలు, సనారీ లాకెట్ గాని శివలింగంగానీ ఉండాలి

**జ్యోతిర్ముడికి కావలసినవి**

ఆవునెయ్యి, పంచదార, పసుపు, కుంకుమ, అగరువత్తులు, కర్పూరం ప్యాకెట్లు॥ తేనెసీసా, గంధండబ్బా, విభూతి పండు, మారేడు పత్రి, కొబ్బరి కాయలు 3, బియ్యం 1 1/4 కేజీ 11 రూపాయల దక్షణ తాంబూలంతో, గంధంరంగు గుడ్డలో కట్టిపాలకొండవెళ్ళి స్వామివార్ని పూజించి పంచామృతములతో అభిషేకించి దీక్షవిరమించాలి.

**శ్రీశ్రీశ్రీ సనారీవారి నిత్య లఘు పూజ**

(సూర్యోదయమునకు పూర్వమే నిద్రమేల్కొని శుచియై సంధ్యావందనము గావించి, పూజామందిరము చేరి పీఠమందలి దైవప్రతిమలు శుభ్రము గావించుకొని స్థిర చిత్తుడై దేవతామూర్తులను పుష్ప, కుంకుమ పన్నీరు, గంధములతో అలంకరించుకొని దైవము కన్నా దిగువుగా నుండునట్లు దర్భాసనము వేసుకొని పద్మాసనాశీనుడై ప్రశాంతంగా కూర్చొండి (ఓంకారము 5 సార్లు చెప్పుకొని.)

**ఆసననమస్కారము**

**ఓం పృథ్వీత్వయాధృతాలోకాదేవీత్వంవిష్ణునాధృతా!**
**త్వఇధారయమాందేవిపవిత్రంకురుచాసనమ్॥**(నమస్కరించి కూర్చోవాలి)

**భూశుద్ధి:** ఓం అ పవిత్ర:పవిత్రోవా సర్వావస్తాంగ తో పివా యస్మరేత్ విశ్వకర్మాణాం సభాహ్యం భ్యంతర శుచిః, (పువ్వుతోగాని, ఆకుతోగాని తన చుట్టూ నీళ్ళు చల్లుకోవాలి,)

**గురుధ్యానం :** గురు బ్రహ్మ గురుర్విష్ణుః గురు దేవో మహేశ్వరః గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః **(పూలమాలవేయునపుడు)**
మల్లికాజాజికుసుమైశ్చంపకవకుళైరపిశతపత్రకల్హారమ్ పుష్ప మాలాంకృతాం॥

**వాగ్దేవి ప్రార్ధన:** ఓం దేవీం వాచమ జనయన్త దేవాస్తాంవిశ్వరూపాః పశవోవదన్తి సానో మంద్రేషు మూర్జం దుహానా ధేనుర్వా గస్మాను పసుష్టు తైతు ఆయం ముహూర్త సుముహూర్తోస్తు ఏతత్ సుముహూర్తకాలే సూర్యాది నవగ్రహాణాం, ఉపగ్రహాణాం సర్వ గ్రహాణాం జన్మలగ్న, జన్మరాశి, నామరాశి, జన్మనక్షత్ర నామనక్షత్ర వశాత్ ఏఏ గ్రహాః ఏఏ రాశి స్తితౌ అత్యంత అనుకూల ఫలసిద్ధర్థ్యం శ్రీ అన్నపూర్ణ సహిత విశ్వేశ్వర దేవతా పూజాం కరిష్యే. (ఉంగరం వేలు పంచపాత్రలో ఉంచాలి). అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే.

**శ్లో॥ ఓం తచ్ఛం యోరావృణీమహే॰ గాతుం యజ్ఞాయ॰ గాతుం యజ్ఞపతయే**
**దైవీం "స్వస్తిరస్తునః॰ స్వస్తిర్మానుషేభ్యః । ఊర్ధ్వం జిగాతుభేషజం**
**శంనో అస్తుద్విపదే" శంచతుష్పదే॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

దీపారాధన

**శ్లో॥ భో! దీపదేవీ రూపస్త్వం కర్మసాక్షి హ్యావిఘ్నకృత్ యావత్ పూజాం**
**కరిష్యామితావత్వం సుస్తిరో భవ॥**

**దీపారాధన ముహూర్తసుముహోర్తస్తు**

(అని దీపారాధన చేయాలి స్వామివారి ఫొటోకు 2వైపులా దీపములుండాలి నమస్కరించాలి).

**గణపతి ప్రార్ధన:** శుక్లాంబరధరం విష్ణుం,శశివర్ణం, చతుర్భుజం , ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వ విఘ్నోప శాంతయే (నమస్కరిస్తూ) ఓం, శ్రీం, హ్రీం క్లీం, గ్లౌం, గ్లం, గం గణపతయేనమః వరవరద సర్వజనం మేవశమానాయ స్వాహా (కనీసం 5 సార్లయినా ఈ మంత్రం చెప్పి పంచపూజలు చేయాలి.) యధాశక్తిజపంకుర్యాత్ ।

లంపృద్వీతత్యాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః గంధం పరికల్పయామి
హం ఆకాశతత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః పుష్పం సమర్పయామి
యం వాయుతత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః దూఫమా ఘ్రాపయామి
రం వహ్నితత్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః దీపం దర్శయామి
వం అమృతతత్మానే శ్రీ మహాగణాధిపతయేనమః నైవేద్యం నివేదయామి

(ప్రసాదం పేరు చెప్పి పెట్టాలి)



సం సర్వాత్మనే శ్రీ మహాగణాధిపతయేనమః సర్వోపచార తాంబూలం సమర్పయామి (తాంబూలం లేక అక్షంతలు వేయవచ్చు)

(నమస్కరిస్తూ) విఘ్నేశ్వరా విఘ్ననాయకా నేను, నా కుటుంబ సభ్యులు సంకల్పించు ప్రతీకార్యము నిర్విఘ్నముగా నెరవేర్చు భగవాన్

**విశ్వకర్మ ప్రార్ధన** (విభూతి పండును విశ్వకర్మగా భావించి)

ఓం విశ్వకర్మాదిశాం పతిస్సనః పసూన్ పాతుసో స్మాన్ పాతు తస్మైనమః

**శ్లో॥ జ్యోతిర్మయాకృతి విశాల వివేకరూప, విజ్ఞాన సృష్టి**
**మయకారణ విశ్వకర్మ।అనాది మూర్తి పరదేవత పంచవక్త్ర**
**పాలాం హ్యికా సృజనకర్తనమో నమస్తే ॥**

పంచశక్తుల సహిత పంచబ్రహ్మల ప్రార్ధన:

ఓం శ్రీ మదాది శక్తి మనుబ్రహ్మ స్వరూపాభ్యాం ఉమామహేశ్వరాభ్యాం నమః
ఓం శ్రీ పరాశక్తి మయబ్రహ్మసరూపాభ్యాం లక్ష్మీనారాయణాభ్యాం నమః
ఓం శ్రీ ఇచ్ఛాశక్తి త్వష్టబ్రహ్మ స్వరూపాభ్యాం వాణీహిరణ్యరూపాభ్యాంనమః
ఓం శ్రీ క్రియాశక్తి శిల్పిబ్రహ్మ స్వరూపాభ్యాం శచీపురంధరాభ్యాం నమః
ఓం శ్రీ జ్ఞానశక్తి విశ్వజ్ఞబ్రహ్మ స్వరూపాభ్యాం సంజ్ఞా భాస్కరాభ్యాం నమః

ఓం అగ్నయేనమః సర్వదేవతాభ్యాం నమః సర్వేభ్యో మహాజనేభ్యోనమః గృహదేవతాభ్యాం నమః మాతా పితృభ్యోనమః (తల్లితండ్రులు గతించిన వారు)(గణపతికి చెప్పినట్లుగా పంచపూజలు విరాట్ విశ్వకర్మ భగవాన్‌కు చేయాలి) (యిలా) లం పృధివీతత్వాత్మనే శ్రీ మహా విశ్వకర్మ దేవతాయై నమః గంధం పరికల్పయామి **ఆఖరున** ఓం విశ్వకర్మ భగవాన్ నన్ను నా కుటుంబ సభ్యులను చల్లగా కాపాడు పితామహా శరణు శరణు శరణు నమస్కరించాలి.)

**ఆచనమనము**

ఓం విశ్వకర్మణే స్వాహా", ఓం సనాతనాయస్వాహా" ఓం జగన్మయాయ స్వాహా" (ఉద్దరణితో తీర్ధము చేతిని గోకర్ణముగా పట్టి 3 సార్లు తీసుకొనవలయును)

## భార్యకు యిచ్చేటప్పుడు

ఓం "కేశవాయ స్వాహా"(అని చెప్పుకుని లోనికి తీసుకోవాలి, ఆనీరు కడుపులో। బొడ్డువరకు దిగిన తరువాత మరల పైవిధంగానే)

"ఓం నారాయణాయ స్వాహా" (అనుకుని ఒకసారీ)

"ఓం మాధవాయ స్వాహా" (అనుకుని ఒకసారీ జలం పుచ్చుకోవలెను.

"ఓం గోవిందాయనమః" (అని చేతులు కడుగుకోవాలి).

"విష్ణవేనమః" (నీళ్లుతాకి, మధ్యవ్రేలు, బొటనవ్రేళ్లతో కళ్లు తుడుచుకోవాలి)

"ఓం మధుసూదనాయనమః" (పై పెదవిని కుడినించి ఎడమకి నిమురుకోవాలి)

"ఓం త్రివిక్రమాయనమః" (క్రింద పెదవిని కుడినించి ఎడమకి నిమురుకోవాలి)

"ఓం వామనాయ నమః" ఓం శ్రీ ధరాయనమః (తలపై నీళ్లు చల్లుకోవాలి)

"ఓం హృషీకేశాయ నమః" (ఎడమచేతితో నీళ్లు చల్లాలి)

"ఓం పద్మనాభాయ నమః (పాదాలపై ఒక్కొక్క చుక్క నీరు చల్లుకోవాలి)

"ఓం దామోదరాయ నమః (శిరస్సు పై జలమును ప్రోక్షించుకోవలెను)

"ఓం సంకర్షణాయనమః" (చేతివ్రేళ్ళు గిన్నెలా వుంచి గెడ్డము తుడుచుకోవలెను)

"ఓం వాసుదేవాయ నమః" (వ్రేళ్లతో ముక్కును వదులుగా పట్టుకోవలెను)

"ఓం ప్రద్యుమ్నాయ నమః" "ఓం అనిరుద్ధాయ నమః (రెండు నేత్రాలు తాకవలెను)

ఓం పురుషోత్తమాయ నమః ఓం అధోక్షజాయనమః (రెండు చెవులు తాకవలెను)

"ఓం నారసింహాయ నమః",ఓం అచ్యుతాయ నమః" (బొడ్డును స్పృశించుకోవలెను)

"ఓం జనార్ధనాయ నమః" (చేతివ్రేళ్లతో వక్షస్థలం, హృదయం తాకవలెను)

"ఓం ఉపేంద్రాయ నమః (చేతికొనలతో శిరస్సు తాకవలెను)

"ఓం హరయే నమః" "ఓం శ్రీ కృష్ణాయ నమః" (కుడి మూపురమును ఎడమ చేతితోను, ఎడమ మూపురమును కుడిచేతితోను తాకవలెను)

## భూతోచ్ఛాటనము

**శ్లో॥ ఓం ఉత్తిష్ఠంతు భూతపిశాచాః ఏతేభూమిభారకాః!**
**ఏతేషామ విరోధేన బ్రహ్మకర్మసమారభే (అక్షంతలు వాసనచూచి ఎడమచేతి వెనుక వైపున వేసుకోవాలి)**



## ప్రాణాయామం

(ప్రాణాయామ అభ్యాసం ఉన్నవారు ఇక్కడ ఆచరించాలి తెలియనివారు ముక్కుపుచ్చుకొని మంత్రం చెప్పాలి)

**శ్లో॥ ఓం ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మాదేవతా**
**దేవీం గాయత్రీచ్ఛందః ప్రాణాయామే వినియోగః**

**మంత్రం :** ఓంభూః, ఓం భువః, ఒగ్ంసువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్స వితుర్వరే"ణ్యం, భర్గోదేవస్య ధీమహీదియోయోనః ప్రచోదయాత్ ఓం మాపోజ్యోతిరసో 2మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ (కుంభకంలో ఈ మంత్రాన్ని వీలైనన్ని సార్లు చెప్పాలి)

## సంకల్పము

మమోపాత్త దరితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిస్య పరమేశ్వరప్రీత్యర్థం, శ్రీ మహకాళీ దేవతా ప్రీత్యర్థం, శ్రీ మహాలక్ష్మీ దేవతాప్రీత్యర్థం, శ్రీ దుర్గాదేవతాప్రీత్యర్థం, శ్రీ సరస్వతీదేవతాప్రీత్యర్థం, శ్రీబాలాత్రిపురసుందరీ దేవతాప్రీత్యర్థం, శ్రీ కామాక్షీదేవతాప్రీత్యర్థం, శ్రీ గాయత్రిదేవతా ప్రీత్యర్థం, శ్రీమీనాక్షీదేవతాప్రీత్యర్థం, శ్రీలలితా దేవతాప్రీత్యర్థం, శ్రీ రాజరాజేశ్వరీ దేవతా ప్రీత్యర్థం పంచ భూతాది ప్రీత్యర్థం, అదిత్యాది నవగ్రహదేవతా ప్రీత్యర్థం ఇంద్రాది అష్టదిక్పాలకాది దేవతాప్రీత్యర్థం నవబైరవప్రీత్యర్థం శ్రీమహావిశ్వకర్మ రాజ్ఞేయప్రవర్ధమానస్య అద్యబ్రహ్మనిర్మిత ప్రపంచకమధ్యేప్రార్థే శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే భరతఖండే మేరోః ర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్యఈశాన్యప్రదేశే కృష్ణా, గోదావర్యోః మధ్యప్రదేశే, (స్వగృహే) సమస్తదేవతాసన్నినౌ, అస్మిన్‌వర్తమానవ్యావహారిక చాంద్రమానేన శుభసంవత్సరే, శుభాయనే, శుభఋతౌ శుభమాసే శుభపక్షే శుభతిథౌ శుభవాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభాబ్యాం, శుభాద్యుదయ సుముహూర్తే శ్రీమాన్‌శ్రీమతః (గోత్రస్య, నామధేయస్య) ధర్మపత్నీసమేతస్యపుత్ర పౌత్రభివృద్ధ్యర్థం సత్య, ధర్మ, అర్ధ, కామ మోక్షాది పంచవిధఫలపురషార్ధ సిధ్యర్థం సకలగ్రహ,

గృహదోషనివారణార్ధం శ్రీ అన్నపూర్ణా సమేత శ్రీ విశ్వేశ్వర దేవతా ప్రీత్యర్ధం జగద్గురుపూజాం కరిష్యే తదంగ కలశారాధనం కరిష్యే ( ఉంగరం వేలు పంచపాత్రలో ఉంచాలి చెప్పగల వారు పంచాంగం ప్రకారం సంవత్సర తిథి వార నక్షత్ర యోగ కరణములు చెప్పాలి)

కలశప్రార్ధన : (కలశానికి గంధంరాశి కుంకుమ బొట్టు పెట్టి)

శ్లో ॥ **ఓం ఘటమూలేస్తితే బ్రహ్మా ఘటార్ధే శక్తి దేవతా ఘటవామే చబుషయో ఘటాంతే భైరవాదయః**

(ధేను, మత్య కూర్మముద్రలు చూపించి నమస్కరించాలి)

నదీప్రార్ధన

శ్లో ॥ **గంగేచ, యమునే, కృష్ణే, గోదావరి, సరస్వతీ, నర్మదే, సింధు, కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు।**

ఆయాంతు శ్రీ సనారీ విశ్వేశ్వరదేవతా పూజార్ధాం మమ దురితక్షయ కారకాః, కలశోదకేనపూజాద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య॥ (పంచపాత్రలోజలం దేవతలపై పూజాద్రవ్యాలపై తన శిరస్సుపై చల్లాలి)

**ప్రాణప్రతిష్ట :** ఓం అసునీతే పునరస్మా"సు చక్షుః పునః ప్రాణ మిహనో"దేహిభోగం" జోక్పశ్యేమ సూర్యముచ్చరం"త। మనుమతే మృడయా"న స్వస్తి। అమృతంవైప్రాణాః అమృతమాపః ప్రాణానేనయ ధాస్థానము పహ్వయతే। పునర్మాయాత్మ పునరాయురాగాత్, నప్రాణా రూపమాగాత్ వైశ్వానరోరస్మిభిః

**అమృతస్వరూపం** (ఇది 5 గానీ, 7 గానీ, 21సార్లు గానీ చెప్పాలి) (అరచేతిలో తమలపాకు పట్టుకొని దేవతామూర్తులను యంత్రములను మూసి అభిమంత్రించ వలయును)

**ఘంటానాదం :** ఓం ఆగమార్థంతు। దేవానాం ।గమనార్ధంతు ।రక్షసామ్ కురుఘంటారావం తత్రదేవతాహ్వాన లాంచనామ్॥ (పూజించు దేవతలను మందిరములో గల మూర్తులలోకి ప్రవేశించినట్లు భావించాలి)

(కుడిచేతిలో అక్షింతలు తీసుకుని "కనులు మూసి భృకిటి దగ్గర పట్టుకొని)"



## స్తవ శ్లోకములు

శ్రీభాసం, శ్యాస్థిర బలయుతం, సిద్ధ తంత్ర ప్రయత్నమ్ బోధాఘఘ్నుం, బుధమననిపుణం, పుణ్యమోఘ ప్రశస్తమ్ ద్వేభావజ్యం దివిజమునివరం, దీనరక్షోస్తుపోష్యమ్ సాభాలీధంసరసగుణమనః సర్వదాహన్నమోస్తు.

పాహిపాహి సనారీశా, పాహిపాహి మునీశ్వరా మమ యన్త్రార్చనం దేవా, బ్రూహిమేలో కనాయకా

శృణుపార్వతివక్ష్యామి యంత్ర మంత్రార్చన విదిః ఆరోగ్యమమితా యుష్మమ్, ఆనన్దం ఆత్మదర్శనమ్

భూవశ్యం భోగసంప్రాప్తి,భుక్తిముక్తి ప్రదాయకమ్ విద్యా వశ్యమ్ విషన్నశ్యమ్, వివిధాగమకోవిదమ్

ఆత్మజ్ఞాన మహాజ్ఞానం విజ్ఞానం విధిసాధనమ్ రోగారిష్ఠం, జ్వరంహన్ని, శత్రు సంతతి వినాశనమ్

పూజా తంత్రం పునశ్చర్యా, ధ్యానమానస సయ్యమా మానవానాం ప్రయత్నేన యిష్టకామ్యార్ధ సిద్ధియేత్ (అక్షింతలు తన శిరస్సు పైన అక్కడ ఉన్న అందిరి శిరస్సుల పైన వేయాలి)

ఓం అస్య శ్రీసనారీవిశ్వేశ్వర మహామంత్రస్య విశ్వేశ్వర ఋషిః అనుష్టుప్ఛన్దః శ్రీ సనారీ విశ్వేశ్వర దేవతా ఓం బీజం, హ్రీం శక్తిః స్వః ఇతి కీలకం మమ సనారీ విశ్వేశ్వర ప్రసాద సిద్ధ్యర్ధే జపే వినియోగః

**కరన్యాసః** ఓం హ్రీం అంగుష్టాభ్యాంనమః ఓం శ్రీం తర్జనీభ్యాం నమః ఓం ఐం మధ్య మాభ్యాం నమః ఓం క్లీం అనామికాభ్యాం నమః ఓం సౌః కనిష్టికాభ్యాం నమః ఓం స్వః కరతలకరపుష్టాభ్యాంనమః

**హృదయాదిన్యాసః** ఓం హ్రీం హృదయాయ నమః ఓం శ్రీం శిరసేస్వాహా॥ ఓం ఐం శిఖాయవౌషట్ ఓం క్లీం కవచాయహుం ఓం సౌః నేత్రత్రయాయ వౌషట్ ఓం స్వః అస్త్రాయఫట్ ఓం భూర్భువస్సు వరోమితిదిగ్బంధః (ఆయాఅవయములుచూపించిచూపుడు వ్రేళ్ళు మెలికవేసి పెట్టాలి.)

**ధ్యానం :** శ్రీ చందనం భసిత కుంకుమ భూషితాంగమ్ వామాన్క భర్తృకర

భూషవిలీన సంస్తాపీతాంబరం కనకఘట్టన రత్నపీఠా వ్యాఖ్యాభయావరద హస్త సుభక్తపాలే (నమస్కరిస్తూ)

**దర్శనం :** ఓం, ఓం, ఓం, హ్రీం, హ్రీం, హ్రీం, శ్రీం, శ్రీం, శ్రీం, క్లీం, క్లీం, క్లీం, సౌః,సౌః సౌః. ఐం, ఐం,ఐం, ఓం దర్శనం, దర్శనం, దర్శనం, దేహి, దేహి, ఆవాహయ, ఆవాహయ, మమసాన్నిధ్యవాసినీం సర్వప్రకాశనీం. సచ్చిదానంద స్వరూపిణీం, స్వస్వరూప దర్శనం దేహిదేహి వౌషట్ వౌషట్ మమా భీష్టంకురుకురు. ఐం ఐం,ఐం, సౌః, సౌః. సౌః, క్లీం, క్లీం, క్లీం శ్రీం, శ్రీం, శ్రీం, హ్రీం, హ్రీం, హ్రీం లోకమాతా ఓం, ఓం, ఓం, శ్రీ సనారీ విశ్వనాథయ నమః దర్శనం కురు కురు శ్రీఘ్రం కురుకురుగురుదేవా.

**మూల మంత్రము :**

**ఓం, హ్రీం, శ్రీం, ఐం. క్లీం, సౌః, సౌః, క్లీం, పీం, శ్రీం,హ్రీం, ఓం**

(108 సార్లు జపం చేయగలిగినంతసేపు జపించి) యధాశక్తి జపంకుర్యాత్ తే॥ పరమ పాంచాల, పావనభక్తరక్ష, బ్రహ్మతేజో ప్రభావ, సంపాద్యవిభవ పార్వతీనాధ, మౌని సంభావ్యనిరత, పాహిసర్వేశ, విశ్వేశబ్రహ్మమూర్తి గీ॥ మమ్ము సనారీశ్వర గరులిమ్ముగ కామ్యముల నొసగియిల ప్రోచుట సిద్ధమ్మని నమ్మిన మనమున సమ్మతిగా వేడి మీకు సాగిల్పడితిన్

(సాష్టాంగ నమస్కారం చేయాలి)

**ఆవాహన:** ఓం శ్రీ అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినేనమఃఆవాహయామి, స్తాపయామి, పూజయామి (అక్షంతలు వేసి నమస్కరించేది)

**ఆసనం**

**శ్లో॥ ఓం దిక్పాలకైర్వైనతేయ మృగేంద్రయుక్తం ఆధార మంటప షడోపరి పార్వతీస్థం,కూర్మాది స్వర్ణమణిభద్ర ప్రలంబమానం సింహాసనం దేవనరైశ్చవంద్యం**

(ఓం సనారి విశ్వనాధాయనమః నవరత్నఖచిత సువర్ణదివ్యసింహాసనం సమర్పయామిస్థిరాసనంకురు (అక్షంతలు వేసి నమస్కరించేది)

**పాద్యం : శ్లో॥ ఓంనమోస్త్వనంతాయసహస్రమూర్తయే సహప్రపాదాక్షి శిరోరు బాహువే,సహస్రనామ్నేపురుషాయశాశ్వితే సహస్ర కోటియుగధారిణేనమః**



అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినేనమఃపాదయోఃపాద్యం సమర్పయామి (నీటిచుక్కను క్రింద వదలాలి)

**అర్ఘ్యం:** ఓం శ్రీఅన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినే నమః హస్తయోఃఅర్ఘ్యం సమలర్పయామి (నీటిచుక్క వదలాలి)

**ఆచమనీయం:** ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః ముఖేఆచమనీయంసమర్పయామి (నీటిచుక్కవదలాలి)

**శుద్ధోదకస్నానం:** ఓం ఆపోహిష్ఠామయోభువః ఓం తాన ఊర్జేదధాతన ఓం మహేరణాయ చక్షసే, ఓం యోవశ్శివతమోరసః, ఓం తస్యభాజ యతేహనః, ఓం ఉశితీరివమాతర, ఓం తస్మాదరంగమామవో ఓం యస్యక్షయాయ జన్వదః ఓం ఆపోజనయధాచనా॥ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః శుద్ధోదకస్నానం సమర్పయామి (తమలపాకుతో నీటిచుక్కను వదలాలి.)

**వస్త్రం :** ఓం ఇవం వస్త్రాణి పీవసావసాధేయివోరచ్ఛి ద్రామంతవో హసర్గాః అవాతి, రతిమమృతాని, విశ్వారైనమిత్రావరుణాశచేధే॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః వస్త్రయుగ్మం సమర్పయామి. (వస్త్రాలు లేకపోతే అక్షంతలువేసిన నమస్కరించేది)

**యజ్ఞోపవీతం :** యజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ఆయుష్యమగ్ర్యం ప్రతి ముంచశుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజః ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః యజ్ఞోపవీతం సమర్పయామి. (యజ్ఞోపవీతంలేకపోతే అక్షింతలు వేయాలి)

**విభూతి :** శ్రీకరంచ పవిత్రంచ శోకరోగనివారకమ్ లోకవశీకరం పుణ్యభస్మం త్రైలోక్యపావనమ్ (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః విభూతి సనుర్పయామి.)

**బిల్వపత్రం :** ఓం త్రినేత్రం త్రితయ బిళ్వం త్రిజన్మావర్త రక్షణం, సర్వపాపక్షయో భక్తాతులసీయుక్తం సమర్పితం.(ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః తులసిపత్రం సమర్పయామి.)

తులసిగానీ, మారేడు పత్రంగానీ వేసి నమస్కరించేది.)

**గంధం :** ఓం గంధద్వారాన్ దురాధర్షాం నిత్యపుష్టాం కరిషిణీం ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియమ్ (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః శ్రీగంధం సమర్పయామి)

**పుష్పమ్ :** ఆయనేతేపరాయణేతే దూర్వారోహన్తు పుష్పిణీ హ్రదాశ్చ పుండరీకాణీ సముద్రస్య గృహాఇవే (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః పుష్పం సమర్పయామి)

**ఆభరణం :** ఓం హిరణ్య రూపస్య హిరణ్య సంధృగపాన్న పాత్యేతుహిరణ్య వర్ణః హిరణ్య యాత్పర్యోనేర్ని షద్యాహిరణ్యదాతదద్యన్న మస్మైః (ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః నవరత్న ఖచిత సువర్ణదివ్యాభరణం సమర్పయామి) అక్షంతలు వేసి నమస్కరించాలి.

## శ్రీ సనారీశతకేతనామవాళి

( నామాలకు ముందుగా ఓం, చివర నమః చెప్పుకొనవలయును)

ఓం శ్రీ లోకదేశికాదేవాయ నమః
శ్రీ గురుప్రభవే
శ్రీ పురుషాయ
ఓం అనంతాయ నమః
ఆగమాకృతయే
కవుళార్చనహితాయ
మకారపంచభోజ్యాయ
సృష్టికర్తాయ
ఆహవనీయబ్రహ్మాగ్నయే
శక్తిరూపాయ 10
శివాకారాయ
శివసంభవమూర్తయే
విద్వేషనాశనాయ
సర్వభూతగణేశాయ
జగన్నిర్మాణకర్తయే

ఓం ఆత్మపూజా నిదర్శనాయ నమః
నానారత్నశిరోమకుటాయ
శుద్ధనిర్గుణ, గోచరాయ
ఓం హంసనిశ్చలసాధనాయ నమః
రాగస్వరూపాయ
రమ్య సంసారసాధనాయ
కాంతాయుక్తాయ
బహుమంగళసంధానాయ
అంగనాంగార్చనయుక్తాయ
శ్రీ పురుషవిద్యరూపాయ
భంగనాశ పదోల్లాసాయ
సకలప్రియాయ
సకలోర్వీమనోహరాయ
సత్యసాగరసాధనాయ
మృత్యుంజయాయ



లాంబికా యోగధారియే
శాంభవీముద్రలక్షాయ
శాశ్వతానందవిగ్రహాయ
క్షీరశైలాంతరస్థితాయ
పద్మపత్రాక్షివీక్షణాయ
నామపారాయణప్రీతాయ
నటప్రియాయ
యక్షగానవినోదినే
సర్వాంగారాధనదేవాయ
శ్రీరూపార్చనసంతుష్టాయ
సర్వతంత్రప్రతాపాయ
పంచాననకులప్రసూతయే
మహావాజ్మయహృద్ఘోషాయై
అగ్రబ్రహ్మాసనేసంస్తాయై
ఓం ఆజ్ఞేయలోచనాయ నమః
రాజ్యలక్ష్మినివాసియే
కారణాత్మవిచారయ
కలిదోషవినాశాయ
ఖేచరీలక్ష్యసాధనాయ
మాయామోహినితంత్రాయ
సర్వవర్ణార్తరక్షణాయ
పంచతత్వాత్మనిశ్చలాయ
నిఖిలాగ్రస్థిరాసనాయ
కోటిలింగేశ్వరస్థానాయ
ప్రేతమోక్షప్రదాయకాయ
సర్వయజ్ఞమయమూర్తియే
త్రిమలామలశోధాయ

ముద్రసాధన సంరక్షాయ
పండితారాధ్యయ
జ్ఞానా జ్ఞానపరిష్కారాయ
మంతగపుత్రికారాధ్యాయ
మధుతర్పణసంతుష్టాయ
పాయసాన్నాహుతిప్రీతాయ
యోగీశ్వరార్చనయుక్తాయ
క్షితిలోకభయంకరాయ
భక్తార్తరక్షణోత్సాతహాయ
ప్రాణవాయు నిరోధాయ
భోగయోగ్యప్రదాయకాయ
ద్వయారాధన సంయుక్తాయ
సాధ్యా సాధ్య విసాధనాయ
వ్యాఘ్రచర్మాంగభూషణాయ నమః
ఓం లింగనిర్మాణదాయకాయ నమః
లింగస్థాపన సంరక్షాయ
లింగకూటార్చనహితాయ
పంచతత్వ ప్రవర్తనాయ
ప్రపంచ సాంఖ్య సంయోగాయ
వశ్యసాధన మన్మధాయ
మానినీ మోహనాకృతయే
కర్మరక్షణసాధనాయ
కర్మప్రాబల్య ఉద్భూతాయ
అద్భుతచారిత్రాయ
వశ్యావశ్యవ శంకరాయ
వేదవేదాంగలక్షణాయ
ఆనందాబ్జపూజితాయ

| | |
|---|---|
| త్రిపురభూషణాయా | భూతలక్ష్యార్థసాధనాయ |
| కళాశాస్త్రవిశారదాయ | పుణ్య శ్రవణ కీర్తనాయ |
| బిందుపూర్ణమనోహరాయ | క్షత్రియాన్వయ భూషాయ |
| నాదరూపాయ | చతుర్వేదహితావర్తిన్యై |
| శ్రీ శైలాగ్రశిరస్సం స్థానాయ | చాతుర్య గుణ సంపన్నాయ |
| సిద్ధమూర్తయే | విషదోషనివారణాయ |
| అజాఫలలభక్షణాయ | బహు విద్యాధిపాయ |
| మలత్రయవిశోధనాయ | హ్రీంకార వర్తనాధ్యక్షాయ |
| త్రిఫలల భక్షణోద్యుక్తాయ | అమ్బురామ్బురాయ |
| త్రికాలజ్ఞానవేదియే | కమండలధారియే |
| దివ్యజ్ఞాననిదర్శనాయ | అమితైశ్వర్యపాలాయ |
| శుద్ధతులసీదళప్రియాయ | ఓం సనారీ విశ్వేశ్వరాయ నమః 108 |

ఓం, హ్రీం, శ్రీం, చిద్విలాసాయై నమః, ఓం సర్వలోకజగద్గురవే నమః ఓం, హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః, భం, భం, మహా దేవ గురు బ్రహ్మార్పణమస్తు

**శ్లో॥** **వామేపార్వతి మారుతాత్మజపురోభాగస్తపార్శ్వద్వయే**
**ప్రేమోద్భూతమహాఋషిమునిగణాః గాన్యాగ్రవేదాగమాః**
**చిన్ముద్రాం కితశూలఫాలమభయాస్వర్ణోపవీతోజ్వాలాః**
**మాలాకుండలనూపురాంగభశితౌపాహీసనారీపతే॥**

**పరిమళద్రవ్యం:** సుగంధం, శీతలం, శుభ్రం, నానా సుగంధ సమన్వితం సనారీ ప్రీత్యర్థం తవదేవదేవేశీత్వామధ్యప్రతిగృహ్యతామ్॥

(అత్తరు , సెంటు, పన్నీరు, దేవతలపై చల్లాలి)

(కుంకుమ పూజ చేస్తే)

**శ్లో॥** **శ్రీమహాదేవిదేవతా భద్రేసర్వమంగళం మంగళే**
**లసత్కుం కుమచూర్ణేన పూజయామి ప్రసీదమే.**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః
కుంకుమ పూజాం సమర్పయామి.



(పసుపు పూజ చేస్తే)

**శ్లో ॥** **ఓం గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీసా**
**చతుష్పదీ అష్టాపదీ నవపదీ బభూవషీ సహస్రాక్షరాపరమేవ్యోమన్**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః
పసుపు పూజాం సమర్పయామి.

(పుష్పాలతో పూజ చేస్తే)

**శ్లో ॥** **ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణిః**
**హ్రదాశ్చపుండరీకాణి సముద్రస్యగృహాఇమే**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినే నమః
పుష్ప పూజాం సమర్పయామి.

**(అక్షితలతో చేస్తే)**

ఓం అర్చత ప్రార్చత ప్రియ మేధాసో అర్చత!
అర్చంతుపుత్రుకా ఉతపురన్న ధృష్ణ్వర్చత
ఓం శ్రీ అన్నపూర్ణా సమేత విశ్వేశ్వరస్వామినే నమః
అక్షతాం పూజాం సమర్పయామి.

**ధూపం:** ఓం గుగ్గిలం ఘృతసంయుక్తం కున్కుమంమహిసాక్షికం ఆఘ్రేయో స్సర్వదేవానాం ధూపోయాంప్రతిగృహ్యతాం॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః ధూపమాఘ్రాపయామి

**దీపం:** ఓం ఉద్దీప్యస్వజాతవేదోపఘ్నం నిరృతిం మమ పశూగుం శ్యామాహ్యామావహ జీవనంచ దిశోదిశః॥

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః దీపం దర్శయామి

**నైవేద్యం:** ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్యధీమహీ ధియోయోనః ప్రచోదయాత్ పరోరజసేసావధోం. సత్యంత్వర్తేన (రాత్రికి ఋతం త్వాసత్యేన) పరిషించామి, అమృతమస్తు అమృతోపస్తరణమసి అమృతమస్తునే అమృతమస్తు (మహానైవేద్యానికి నీళ్ళు చుట్టూ జల్లి తమలపాకుతో నీటిని నివేదనాపదార్ధములపై జల్లుతూ.

ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః (పేరు చెప్పి) నైవేద్యం సమర్పయామి

**తాంబూలం:** శ్లో॥ పూగీ పలైస్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ముక్తాచూర్ణ సమాయుక్తంతాంబూలం ప్రతిగృహ్యతామ్॥
ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః తాంబూలం సమర్పయామి (తాంబూలం లేకుంటే అక్షతలు ఉంచాలి)
**నీరాజనం:** శ్లో॥ హరిఃఓం అర్ధం జ్వలతీ జ్యోతీరహమస్మీ జ్యోతిజ్వలతీ బ్రహ్మహమస్మియోహమస్మి బ్రహ్మహమస్మి అహమస్మి బ్రహ్మహమస్మి అహమేవా హం మాంజుహోమిస్వః॥
ఓం శ్రీ అన్నపూర్ణసమేత విశ్వేశ్వరస్వామినేనమః ఆనంద కర్పూరనీరజనం సమర్పయామి (కర్పూరం వెలిగించి గంట వాయిస్తూ స్వామికి చూపాలి)

**మంత్రపుష్పము**

(పుష్పాక్షతలు చేతిలో పట్టుకుని నిలబడి)

నమస్తే అస్తుభగవాన్
విశ్వేశ్వరాయమహాదేవాయత్రయంబకాయత్రిపురాంకాయత్రికాగ్నికాలాయ, కాలాగ్నిరుద్రాయ, నీలకంఠాయ, మృత్యుంజయాయ, సర్వేశ్వరాయ, సదాశివాయ. శ్రీమన్మహాదేవాయనమః ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామియే నమః సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి.
ఓం విశ్వకార్మచ విద్మహే॥ పంచవక్త్రాయ ధీమహి॥ తన్నో విశ్వబ్రహ్మః ప్రచోదయా"త్॥
ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వ"రేణ్యం । భర్గోదేవస్య ధీమహి॥ ధియోయోనః తన్నోగాయత్రీ ప్రచోదయా"త్॥
ఓం పంచవక్త్రాయ విద్మహే॥ బ్రహ్మగజాయ ధీమహి॥ తన్నో మనుః ప్రచోదయా"త్॥
ఓం పంచక్త్రాయ విద్మహే । లోక కర్త్రేచ ధీమహి॥ తన్నో మయః ప్రచోదయా"త్॥
ఓం పఞ్చవక్త్రాయ విద్మహే॥ మహాపూజ్యాయ ధీమహి॥ తన్నో త్వష్టః ప్రచోదయా"త్॥
ఓం పఞ్చవక్త్రాయ విద్మహే॥ సృష్టి కర్త్రేచ ధీమహి॥ తన్నో శిల్పిఃప్రచోదయా"త్



ఓం పంచక్త్రాయ విద్మహే॥ లోకజ్ఞానాయ ధీమహి- తన్నో విశ్వజ్ఞః ప్రచోదయా"త్॥
ఓం వీరనారాయణాయ విద్మహే॥ విరాట్పురుషాయ ధీమహి॥ తన్నో వీరబ్రహ్మః ప్రచోదయా"త్॥
ఓం మహాదేవ్యైచ విద్మహే। వీరబ్రహ్మ పత్న్యైచ ధీమహి- తన్నో గోవిందాంబా ప్రచోదయా"త్
ఓం మహాశక్త్యైచ విద్మహే॥ వీరబ్రహ్మ పౌత్రీచ ధీమహి- తనో ఈశ్వరీ ప్రచోదయా"త్
ఓం మహాభక్తాయ విద్మహేవీరబ్రహ్మ శిష్యాయ ధీమహి తన్నో సిద్ధప్రభోదయా"త్॥
ఓం విశ్వేశ్వరాయ విద్మహే॥ బ్రహ్మ జ్ఞానదాతాయ ధీమహి- తన్నో సనారీః ప్రచోదయా"త్
ఓం మహాదేవ్యైచ విద్మహే॥ సనారీ పత్న్యైచ ధీమహి॥ తన్నో అన్నపూర్ణాః ప్రచోదయా"త్॥
ఓం సాధుతత్వాయ విద్మహే, ఈశ్వరాంశాయ ధీమహి తన్నో సాయి ప్రచోదయా"త్॥
ఓం వాగీశ్వర్యైచ విద్మహే కామేశ్వర్యైచ ధీమహి॥ తన్నో కామాక్షీ ప్రచోదయా"త్॥
ఓం సాంబశినందాయవిద్మహేజ్ఞానదాత్రాయధీమహీ । తన్నో బోధగురుప్రచోదయా"త్

**ప్రదక్షణమ్**

**శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతరకృతానిచ తానితాని ప్రణశ్యన్తి ప్రదక్షణ పదే పదే పాపోహం పాపకర్మాణాం పాపాత్మాం పాపసంభవాం త్రాహిమాం కృపయాదేవా శరణాగతవత్సలా అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష మహేశ్వర రక్ష రక్ష సనారీ విశ్వేశ్వర రక్ష రక్ష జగద్గురుః**

(పీఠం చుట్టూ 3సార్లు ప్రదిక్షణము చేసి సాష్టాంగనమస్కారము చేస్తూ)

**శ్లో॥ ఉరసా, శిరసా, దృష్ట్యా మనసావచసా తథా పదాభ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామ్యం, అష్టాంగముచ్యతే**

ఓం శ్రీ అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరస్వామినేనమః సాష్టాంగ నమస్కారం సమర్పయామి

**చత్రం:** ఓం శ్రీ అన్నపూర్ణ సమేత విశ్వనాధస్వామినేనమః యధాశక్తి పూజాం కరిష్యామి, చత్రం సమర్పయామి, చామరం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, వాద్యం ఘోషయామి, ఆందోళి కమారోహయామి, గజమారోహయామి, అశ్వమారో హయామి, సమస్త రాజోపచారాన్ సమర్పయామి, సమస్త దేవో పచారాన్ సమర్పయామి, సమస్త శక్త్యుపచార భక్త్యుపచారాన్ సమర్పయామి. (అక్షతలు ఒక్కొక్క దానికి చల్లాలి).

**పరిపూర్ణ:** శ్రీ దేవ దేవ మహాదేవ పరాత్పరంవా బోధాసుబోధ పరతత్వ ప్రపంచసర్వే మోదాయ భక్త జనలోక ఫలప్రదాయ విశ్వేశ్వరాయ అమితప్రియదేశికాయ ఓం, హ్రీం సనారీ విశ్వేశ్వరాయనమః యధాశక్తి మమజపం, పూజా జగద్గురు బ్రహ్మార్పణమస్తు (అక్షంతలు చేతిలో వేసుకొని నీళ్ళువదలాలి) మంత్రయుక్తం క్రియాయుక్తం భక్తియుక్తంత త్సర్వంక్షమ్యతాం సనారీ విశేశ్వరసద్గురువే నమః.

**మంగళహారతి**

మంగళం మంగళం మహనీయమూర్తికి, శృంగారమూర్తికి, శుభకరునకు మంగళం మంగళం॥

1. నింగీరసాతలము నిండిన వానికి బంగారు హారతి పరమూర్తినీకే, మంగళం మంగళం సద్గురునీకే మంగళం మంగళం.
2. హరిహర బ్రహ్మాది అష్టదిక్పతులకూ అమర దానవ దైత్యానంతునకు ఆదిపుట్టిన శక్తి అవని మానవులకు ఆదియయిన విశ్వానాధా గురువరా నీకే మంగళం మంగళం ॥ సద్గురునీకే మంగళం మంగళం॥
3. యజనా యజనాది యారు కర్మంబుల భజనీయమూర్తి విభాగ్యకరా కుజన జనఘ్న సంకోచనాశ "ఈశ" భజనీయ మనస్కా భావసద్గురునీకే మంగళం మంగళం॥
4. నాదరూప సర్వనాయికా సయ్యమా నాదనిలయ వేదబోధాధిపా వేదాంత సారభూ విద్యనీవేకానీ పాదారవింద ప్రవత్తి మంగళమిదే



మంగళం మంగళం॥ సద్గురునీకే మంగళం మంగళం॥

5. సర్వావర్ణములకు సకలవృత్తులనిచ్చి నిర్వహించితివయ్యా నిఖిలేశ్వరా పర్వతావాసుల పట్టణజనులకు సర్వమిచ్చినావు సర్వజగద్గురువా మంగళం మంగళం॥ సద్గురునీకే మంగళం మంగళం॥
6. ఐహి కులకు నీవు అవని కోరకలీయ అవుతారించినావు ఆత్మేశ్వరా సయ్యమాదేవా మా సర్వమంతయు నిచ్చి సంతోషముననిపుడే సత్కరింతుము గురుశ్రీ మంగళం మంగళం ॥ సద్గురునీకే మంగళం మంగళం॥
7. విష్ణుకూటములందు విరివిగా వెలిసిన వీరశాక్తేయుడవై వెలిసినావు విష్ణు పారలింగవీరుల గలసిన విశ్వనాధా సర్వవిశ్వా దేశికనీకు మంగళం మంగళం॥ సద్గురునీకే మంగళం మంగళం॥
8. అవని భక్తులకెల్ల ఆధారణముచేకసి ఆరుమతముల ఆధారమగుచు నివసించిమాయింట నిజదాసులనుబ్రోవు నిర్మలమూర్తిని నీరాజనంబిదే మంగళం మంగళం సద్గురునీకే మంగళం మంగళం॥

**తీర్థం తీసుకునేది**

అజ్ఞానమూలహరణం జన్మ కర్మనివారణం । భక్తి జ్ఞానవైరాగ్య సిధ్యర్థంగురుపాదోదకం పీత్వా ॥(శబ్దం రాకుండా తీర్థం తీసుకుని)

ఓం అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామి నిర్మాల్యం శిరసాగృహ్ణామి (పూజ చేసిన పుష్పాక్షతలు కనులకద్దుకుని శిరసుపై వేసుకోవాలి)

**41వ రోజున** ఉద్వాసన :

ఓం శ్రీ అన్నపూర్ణాసమేతవిశ్వేశ్వరస్వామినేనమః యధాస్తానము ధ్యాసయామి చేయగలిగితే శివలింగానికి అభిషేకం, శ్రీ సూక్త, పురుషసూక్తాలు చెప్పుకోవచ్చును.

**క్షీరాద్రివాసా శిరసానమామి( అన్ని నామాలకు చెప్పాలి)**

శ్రీలోకదేశికా దేవా, ॥క్షీరాద్రి॥

శ్రీదేవా ॥క్షీరాద్రి॥

శ్రీసుఖోల్లాస సంతతా ॥క్షీ॥
శ్రీగిరివాసా, శ్రీ శైలవాసా, ॥క్షీ॥
శ్రీగంధవిభూతిదారణా ॥క్షీ॥
శ్రీరూపార్చనసంతుష్టా ॥క్షీ॥
అత్యానందస్వరూపాయ ॥క్షీ॥
అర్కదక్షిణలోచనాయ ॥క్షీ॥
అగ్రబ్రహ్మాసన సంస్తానాయ ॥క్షీ॥
అజాఫలలభక్షణాయ ॥క్షీ॥
అరివర్గాంకురచ్ఛేదాయ ॥క్షీ॥
అంగనాంగార్చనయుక్తాయ ॥క్షీ॥
అష్టాంగయోగియోగాంగాయ ॥క్షీ॥
అన్నపూర్ణామనోనాయకా ॥క్షీ॥
అభయప్రధాతా ॥క్షీ॥
అంధకారధ్వంసకా ॥క్షీ॥
ఆవాహనీయబ్రహ్మాగ్నియే ॥క్షీ॥
ఆశ్రయదయామూర్తీ ॥క్షీ॥
ఆసవాదిమధుప్రీతాయ ॥క్షీ॥
ఆత్మపూజానిదర్శనాయ ॥క్షీ॥
ఆనందాబ్జపూజితాయ ॥క్షీ॥
ఆదిబ్రహ్మమహాప్రభూ ॥క్షీ॥
ఆరాధనప్రియా ॥క్షీ॥
ఆదిశంకరవంశపావనా ॥క్షీ॥
ఆరోగ్యప్రధాతా ॥క్షీ॥
ఆజానుకరధ్వందాయ ॥క్షీ॥
ఇడాపింగళసుషుమ్నవిజేతా ॥క్షీ॥
ఈశ్వరాంశసంభవా ॥క్షీ॥
ఉత్తమారాధనమూర్తీ ॥క్షీ॥

ఊరీజనక్షేమంకరా ॥క్షీ॥
ఋభూషణాయ ॥క్షీ॥
ఋపలావణ్యాయ ॥క్షీ॥
లుబ్ధతనంబెరుగనివాడా ॥క్షీ॥
లూలాగుబిగించినదేవా ॥క్షీ॥
ఎరుకగలస్వామీ ॥క్షీ॥
ఏలినవారిగురుదేవా ॥క్షీ॥
ఐశ్వరాంగాయ ॥క్షీ॥
ఓంకారేశ్వరాయ ॥క్షీ॥
ఔన్నత్యరసవాదా ॥క్షీ॥
అంతా తెలిసినస్వామీ ॥క్షీ॥
అఃమునుజయించినదేవా ॥క్షీ॥
కవుళార్చనహితాయ ॥క్షీ॥
కర్మసాగర మధ్యస్తాయ ॥క్షీ॥
కలిదోషవినాశాయ ॥క్షీ॥
కళాశాస్త్రవిశారదాయ ॥క్షీ॥
కారణాత్మవిచారణాయ ॥క్షీ॥
కాషాయాంబరాయ ॥క్షీ॥
కాలాతీతాయ ॥క్షీ॥
కోటిలింగేశ్వరస్తానాయ ॥క్షీ॥
కౌపీనకమండలదారీ ॥క్షీ॥
కౌళార్చనహితాయ ॥క్షీ॥
ఖేచరీలక్ష్యసాధనా ॥క్షీ॥
గవాక్షీరహితప్రియాయ ॥క్షీ॥
గిరిహరభవహరా ॥క్షీ॥
గురుయజ్ఞప్రియసఖా ॥క్షీ॥
గ్రహదోషనివారణాయ ॥క్షీ॥



గౌతమీతీరవాసాయ ॥క్షీ॥
గౌరీపుత్రాగురుదేవా ॥క్షీ॥
ఘంటానాదఆవాహనా ॥క్షీ॥
జ్ఞానప్రదాతా ॥క్షీ॥
చతుర్వేదహితావర్తీ ॥క్షీ॥
చతురాశ్రమసాధనా ॥క్షీ॥
చాతుర్యగుణసంపన్నా ॥క్షీ॥
చామరాగ్రసమీరస్తాయ॥క్షీ॥
ఛాయాముద్రాయ॥క్షీ॥
ఛత్రపాదుకసంచారా ॥క్షీ॥
జగన్మోహనవిగ్రహా ॥క్షీ॥
జన్మదోషనివారణాయ ॥క్షీ॥
జయసంగ్రహనిగ్రహాయ ॥క్షీ॥
జయతాంత్రీకవర్ధక్యై ॥క్షీ॥
జగద్గురు విశ్వనాదా ॥క్షీ॥
జయజయగురుదేవా ॥క్షీ॥
ఝూములు ధారణగల్గిన ॥క్షీ॥
ఞెమంత్రంబువీడిన ॥క్షీ॥
టక్కరివాదులగట్టిన ॥క్షీ॥
ఠతపములోకజీవులకన్న ॥క్షీ॥
డబ్బునురోసివీడిన ॥క్షీ॥
ఢంగుల్వలదనితెల్పిన ॥క్షీ॥
"ణా"లుజనులకు నిచ్చిన ॥క్షీ॥
తత్వసంకేతపాలనాయ ॥క్షీ॥
త్రయీషణఫలప్రదాయ ॥క్షీ॥
త్రిదేహావరణపరిశుద్ధాయ ॥క్షీ॥
త్రిఫలలభక్షణోద్యుక్తాయ ॥క్షీ॥

త్రికాలజ్ఞానవేదినే ॥క్షీ॥
తుర్యమంగళవాక్ఘోషాయ ॥క్షీ॥
దర్శతత్వనిదర్శనాయ ॥క్షీ॥
ధహరోపాసనసంస్థితాయ ॥క్షీ॥
దక్షిణాగ్నిమహాయజ్ఞకర్తాయ ॥క్షీ॥
దివ్యజ్ఞాననిదర్శనాయ ॥క్షీ॥
దివ్యలక్ష్యసుగోచరాయ ॥క్షీ॥
దీర్ఘారోగనివారణాయ ॥క్షీ॥
ధర్మాధర్మవివర్జితాయ ॥క్షీ॥
నవపాషాణహర ॥క్షీ॥
నాదబిందుకళాతీతాయ ॥క్షీ॥
నానారత్నశిరోమకుటాయ ॥క్షీ॥
నానాచిన్హితకేతనాయ ॥క్షీ॥
నామపారాయణప్రీతాయ ॥క్షీ॥
నిఖిలాగ్రస్తిరాసనాయ ॥క్షీ॥
నిశాచరకళాన్యాసాయ ॥క్షీ॥
నిగమసంయమాయ ॥క్షీ॥
నిర్మలాలయసంస్తానాయ ॥క్షీ॥
పద్మపత్రాక్ష వీక్షణాయ ॥క్షీ॥
పక్షాపక్షోపచారాయ ॥క్షీ॥
పంచతత్వాత్మనిశ్చలాయ ॥క్షీ॥
పంచాననకులప్రసూతయే ॥క్షీ॥
పూర్వజన్మనివారణాయ ॥క్షీ॥
పాయసాన్నాహుతిప్రీతాయ ॥క్షీ॥
ప్రపంచసాంఖ్యసంయోగాయ ॥క్షీ॥
పిత్తదోషనివారణాయ ॥క్షీ॥
ప్రేతమోక్షప్రదాయకాయ ॥క్షీ॥

పురుషపూజామనోహరాయ ॥క్లీ
పునరావృత్తినాశాయ ॥క్లీ
పుణ్యశ్రవణకీర్తనాయ ॥క్లీ
పార్వతీశమునీశ్వరాయ ॥క్లీ
పంచాననకులప్రముఖా ॥క్లీ
పరశువేదిదర్శనాయ ॥క్లీ
పావనాపతితపావనాయ ॥క్లీ
పాపవినాశాయ ॥క్లీ
ప్రధానశిష్యవర్గాయ ॥క్లీ
ప్రాగాథర్వణతాంత్రికాయ ॥క్లీ
పద్మినీనాయకాయ ॥క్లీ
పరమశివావతార ॥క్లీ
పంచవంశప్రజాపాలనాయ ॥క్లీ
బహుమంగళవాగ్భూషాయ ॥క్లీ
బహుపూజావిధాయకాయ ॥క్లీ
బ్రహ్మజ్ఞాన ప్రధాతా ॥క్లీ
బహుమంగళసంధానాయ ॥క్లీ
భంగనాశపదోల్లాసాయ ॥క్లీ
భంబీజధ్వజనాయకా ॥క్లీ
భూచరీయోగలక్ష్మాయ ॥క్లీ
భూతలక్ష్యార్థసాధనాయ ॥క్లీ
భస్మత్రిపుంద్రధారణా ॥క్లీ
మధ్యమారాధనమూర్తియే ॥క్లీ
మహావాంగ్మయహృద్ఘోషాయ ॥క్లీ
మంగళధ్వని నిశృంఖలాయ ॥క్లీ
మయాతీతాయ ॥క్లీ
మహాప్రేతాయ ॥క్లీ

మతత్రయవిశోధనాయ ॥క్లీ
మతంగపుత్రికారాధ్యాయ ॥క్లీ
మాతృకావర్ణరూపిణే ॥క్లీ
మానినీమోహనకృతయే ॥క్లీ
మహాభోగీంద్రాయ ॥క్లీ
మాయామోహవిభేదాయ ॥క్లీ
మునిజనసేవితాయ ॥క్లీ
ముఖ్యాంగపాదుకధ్యానాయ ॥క్లీ
మోక్షప్రదాతామోహనకారా ॥క్లీ
ముక్కంటిదర్శనాయ ॥క్లీ
యక్షగానవినోదినే ॥క్లీ
యోగనిద్రానిరంతరాయ ॥క్లీ
యోగీంద్రారాజయోగీ ॥క్లీ
రసవాదప్రసిద్ధా ॥క్లీ
రమ్యసంసారసాధనా ॥క్లీ
రాగస్వరూపాయ ॥క్లీ
రామార్తరక్షణోత్సాహాయ ॥క్లీ
రాక్షసాధిపదాశనా ॥క్లీ
రూపలావణ్యాయ ॥క్లీ
రాజరాజమునీశ్వరాయ ॥క్లీ
రౌంజాధ్వనివినోదాయ ॥క్లీ
లాంబికాయోగధారి ॥క్లీ
లింగనిర్మాణదాయకాయ ॥క్లీ
లింగ కూటార్చనహితాయ ॥క్లీ
లింగ పూజానిదర్శనాయ ॥క్లీ
వాణీవాగ్మయభూషాయ ॥క్లీ
వాచాభజనకీర్తనాయ ॥క్లీ



వాతదోషనివారణాయ ॥క్లీ
వామాంకపార్వతీయుక్తాయ ॥క్లీ
విశేష యోగసంధానాయ ॥క్లీ
విగ్రహారాధనయుక్తాయ ॥క్లీ
విశేషజపసాధనాయ ॥క్లీ
విశ్వరూపసందర్శనాయ ॥క్లీ
విధాతృమనుసంయమాయ ॥క్లీ
వికటేక్షణవిగ్రహాయ ॥క్లీ
విప్రవిభ్రంశసాధనాయ ॥క్లీ
విశ్వకర్మామహాత్మనే ॥క్లీ
విరాచార్య పుత్రావిశ్వనాథా ॥క్లీ
విశ్వకర్మకులోద్ధారకా ॥క్లీ
విరాట్ స్వరూపాసనారీ ॥క్లీ
శ్రవణానందమోదాయ ॥క్లీ
శంకరోద్భవవంశేంద్రా ॥క్లీ
శుద్ధతులసీదళప్రియా ॥క్లీ
శాస్త్రజ్ఞానవిశారదాయ ॥క్లీ
శిష్టదేవగణార్చితాయ ॥క్లీ
శివ సంభవమూర్తియే ॥క్లీ
శ్లేష్మదోషనివారణాయ ॥క్లీ
శ్రేష్ట స్త్రీపురుషపూజితాయ ॥క్లీ
శుభ్రస్వర్ణకృతోల్లాసాయ ॥క్లీ
సర్వకామఫలప్రదాయ ॥క్లీ
సర్వాభరణసంతుష్టాయ ॥క్లీ
సర్వమూర్తి మనోహరాయ ॥క్లీ
సర్వాంగారాధనదేవాయ ॥క్లీ
సర్వాగమవిచారిణ్వై ॥క్లీ

సర్వతంత్రప్రతాపాయ ॥క్లీ
సర్వామనస్కయోగీశాయ ॥క్లీ
సర్వపీఠాగ్రవాసాయ ॥క్లీ
సర్వరోగనివారణాయ ॥క్లీ
సకాంతార్ధాంగమంగళాయ ॥క్లీ
సర్వమంత్రాత్మకాయ ॥క్లీ
సత్యసాగరసాధనాయ ॥క్లీ
సత్యనిగ్రహకారణాయ ॥క్లీ
సర్వదేవనివాసాయ ॥క్లీ
సర్వజీవనదయావరాయ ॥క్లీ
సనత్కుమారాయ ॥క్లీ
సద్భానుభాసురాయ ॥క్లీ
సహస్రభాహువే ॥క్లీ
సర్వదేవసంయమదేశికాయ ॥క్లీ
సర్వకారుమహేశ్వరాయ ॥క్లీ
సర్వాగయోక్తఅవధూతయే ॥క్లీ
సచ్చిదానందవిగ్రహాయ ॥క్లీ
సర్వదేదోద్భవాదేవాయ ॥క్లీ
సర్వమానవపూజాంఘ్రియే ॥క్లీ
సాధపూజాంఘ్రిపంకజాయ ॥క్లీ
స్వర్గమోక్షప్రధామూర్తే ॥క్లీ
సర్వలోకవందితాయ ॥క్లీ
సదాబ్రహ్మాసనేసంస్థానాయ ॥క్లీ
సమస్తవాహనారూఢాయ ॥క్లీ
సర్వలోకజగద్గురవే ॥క్లీ
సాన్నిధ్యసర్వదేశికాయ ॥క్లీ
సాధ్యసాధ్యవిసాధనాయ ॥క్లీ

సుబిళ్వార్చనసంతుష్టాయ ॥క్లీ
సృష్టిస్థితిలయాకారాయ ॥క్లీ
సామగాన ప్రియాలోలాయ ॥క్లీ
షన్ముఖపితాయే ॥క్లీ
షన్మతోద్ధారకాయ ॥క్లీ
షడ్రసాన్నాదిభోగేంద్రాయ ॥క్లీ
హన్మంతకేతనోనిరతాయ ॥క్లీ
హంసమంత్రమనోహరాయ ॥క్లీ
హనుమధ్వజాప్తా ॥క్లీ
హరభంజనతాపసాయ ॥క్లీ
హ్రీంకారవర్తనాధ్యక్షాయ ॥క్లీ
ళాపింగళులకు దరివాడా ॥క్లీ
క్షత్రియాన్వయ భూషాయ ॥క్లీ
క్షరఖండనదాయకా ॥క్లీ
క్షామాంతకా ॥క్లీ
ఓం హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః భంభం
మహాదేవగురుబ్రహ్మార్పణమస్తు.

## సనారీశరణుఘోష

1. ఓం, హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః జగద్గురుదేవా ॥
(శరణం, శరణం, సనారీవిశ్వనాధా అన్నిటికీ చెప్పాలి)
2. ఓం సర్వపీఠాగ్రవాసపాదుకార్చనతృప్తమానసా ॥శరణం॥
3. ఓం అచలావృత్త్యైకమహాసింహాసనాగ్రఅధ్యక్షా ॥శరణం॥
4. ఓం ద్వైతాద్వైత విశిష్టాద్వైతమానుషస్వరూపా ॥శరణం॥
5. ఓం సమస్త ప్రపంచసమ్మోహనమహాశక్తినాయకా ॥శరణం॥
6. ఓం నిర్గుణోపాసధ్యానమహాజనమానసాకారా ॥శరణం॥
7. ఓం పితృమాతృకళ త్రవింశతివంశపావనా ॥శరణం॥
8. ఓం, అనేక జన్మాంతరదోష భక్తజనపావనదేవా ॥శరణం॥
9. ఓం యమనియమాది అష్టాంగయోగప్రసిద్ధా ॥శరణం॥
10. ఓం అనంత యోగతత్వమంత్రయంత్రాగమ ప్రచారా ॥శరణం॥
11. ఓం త్రిలక్ష్యస్తానధ్యానభక్త జననాయకాధ్యక్షా ॥శరణం॥
12. ఓం సుగంధపరిమళమిళద్గుమద్గుమాఘ్రుణే ॥శరణం॥
13. ఓం చతుర్వర్గయోగ జనఫలప్రదాన గురుదేవా ॥శరణం॥
14. ఓం కామక్రోధాదిషడ్వర్గవిచ్ఛేదనా మూర్తీ ॥శరణం॥



15. నీ ఓం కుండలి నీమధ్యనిగూఢ దేదీప్యప్రకాశా ॥శరణం॥
16. రౌ ఓం రౌంజాది భేరీమృదంగ నాదానందవిగ్రహా ॥శరణం॥
17. ఓం అనంత వేదాగమ మంత్ర యంత్రశాస్త్రప్రవీణా ॥శరణం॥
18. ఓం భూతప్రేతపిశాచ బ్రహ్మరాక్షసాదిగ్రహబేధనోత్సాహ ॥శరణం॥
19. ఓం అవాఙ్మానసగోచరానంద బ్రహ్మమయస్వరూపా ॥శరణం॥
20. ఓం దేవ బ్రాహ్మణా దికులీనజనమనోనురాగరూపా ॥శరణం॥
21. ఓం పూర్ణసుధాకర ప్రభాకరాకార సచ్చిదానందా ॥శరణం॥
22. ఓం జాతస్తితల యాదిమహాకర్మకర్తృత్వదేవా ॥శరణం॥
23. ఓం అష్టోత్తర వింశతినామ పారాయణ ప్రీతా ॥శరణం॥
24. ఓం శతసహస్రనామాదికుంకుమార్చనసంతృప్తా ॥శరణం॥
25. ఓం షడ్వర్గమార్గవిచ్ఛేదనాసక్త భక్తవత్సలా ॥శరణం॥
26. ఓం ఆగామిసంచిత ప్రారబ్ధకర్మ రక్షణోత్సాహ ॥శరణం॥
27. ఓం మహాభాగవతకోవిదాస్తాన సభానాయకా ॥శరణం॥
28. ఓం మహాకౌళార్చన మంత్ర కోవిదాస్తానాధ్యక్షా ॥శరణం॥
29. ఓం ఆజ్ఞాచక్రనివాస విశ్వనాధ గురుదేవా ॥శరణం॥
30. ఓం సహస్రారకమల మధ్యప్రచారం రూపాస్వ ॥శరణం॥
31. ఓం వీరాశాక్తేయ మహాగణదివ్యజనమనస్పంధానా ॥శరణం॥
32. ఓం అనేకలోకమానుషలోకనిర్మాణదాయకా ॥శరణం॥
33. ఓం గణేశనివాసమూలాధార పీడనతనుభాసురా ॥శరణం॥
34. ఓం స్వాధిష్ఠానమయప్రచారసాక్షాత్కరగురుబ్రహ్మ ॥శరణం॥
35. ఓం సంకర్షణాస్తానమణిపూరక నివాసాధ్యక్షా ॥శరణం॥
36. ఓం దిగంబరభసితాంగ రక్షణాహతాంతరనివాసా ॥శరణం॥
37. ఓం స్వచ్ఛప్రకాశసుందర మనస్పంధాననాయకా ॥శరణం॥
38. ఓం, ఐం, వైష్ణవమాయాతత్వవిశోధనాంగదేవా ॥శరణం॥
39. ఓం, క్లీం, మాయాకమల కలుషచ్ఛేదనాంగమహాభాగా ॥శరణం॥

40. ఓం సోః కార్మికా మలదోషశ్ఛేదన శివస్వరూపా ॥శరణం॥

41. ఓం మధురాదిమహాషడ్రసాన్న భక్ష్యసంతుష్టానందా ॥శరణం॥

42. ఓం గాఢాలింగన సనారీవామాంక భస్మోద్ధూళితరూపా ॥శరణం॥

43. ఓం పార్వతీ సమేతకాషాయంబర కౌపీనదండధరా ॥శరణం॥

44. ఓం శ్రీభూతిరుద్రాక్ష, జటావల్క లకమండలకతారిధరా ॥శరణం॥

45. ఓం దాక్షాయణీసమేతత్రి నేత్ర దర్శక మహానుభావా ॥శరణం॥

46. ఓం త్రయత్రింశత్కోటి దేవతాగణపూజితానందా ॥శరణం॥

47. ఓం రజస్సత్వతమోపేతగుణాకర్షకాధ్యక్షదేవా ॥శరణం॥

48. ఓం పృధి వ్యాదిమహాభూతపంచకనాయకాగ్రణీ ॥శరణం॥

49. ఓం శ్రవణకుహరాంతరాళసునాద గ్రాసమానసా ॥శరణం॥

50. ఓం యనభైనాల్గులక్షల జీవసంభవ స్తితిలయకారకా ॥శరణం॥

51. ఓం సమస్తదేవతాగణ నిదర్శనదేవాది దేవా ॥శరణం॥

52. ఓం దురాచారాదిదశవిధ దురవస్తవినాశాయా ॥శరణం॥

53. ఓం, సమస్తతత్వయోగ విద్యావచోవిలాస ప్రకాశా ॥శరణం॥

54. ఓం, అనంతభూలోకవాస స్త్రీపురుష, భోగ, మోక్షప్రధాతా ॥శరణం॥

55. ఓం, సమస్తజంతుపోషణాధార మూలవిరాట్ ప్రభూ ॥శరణం॥

56. ఓం అనేక కోటి బ్రహ్మాండ నిర్మాణ విరాట్ విశ్వకర్మా ॥శరణం॥

57. ఓం ఋషి, మౌని, యోగి, యోగినీ గణ సేవితానంధా ॥శరణం॥

58. ఓం త్రయీాషణమదరాగ భోగవిచ్ఛేధనమంగళాకారా ॥శరణం॥

59. ఓం అణిమాదిమహాదృష్టభూతి వరఫల సిద్ధి ప్రసాదా ॥శరణం॥

60. ఓం వీరపద్మాసన, వోడ్వాణ, జాలాంధ రాసనా వాసా ॥శరణం॥

61. ఓం నవరత్న గుణమణిప్రదీపితమహాసింహా సనాధ్యక్షా ॥శరణం॥

62. ఓం ఆసూన విజ్ఞానజ్ఞాన శాస్త్రాంతర రహస్య భావ నాయకా ॥శరణం॥

63. ఓం యోగాదిమహా మంత్ర కళాజ్ఞాన సంపూర్ణసుధాకరా ॥శరణం॥

64. ఓం అజ్ఞానధ్వాంత శూన్యతను మనోమహాపాపచ్ఛేదనాకారా ॥శరణం॥



65. ఓం శమాదిషట్క సాధనాచిత్తజన మనోఫలప్రదాతా ॥శరణం॥

66. ఓం బిళ్ళతులసీదళాక్షత నీరాజన, మానసారాధన ప్రియా ॥శరణం॥

67. ఓం పంచతత్త్వైక్యమహామంత్ర, తంత్ర యంత్ర ఫలప్రధాతా ॥శరణం॥

68. ఓం జ్వాజ్వల్యమాన మహాగ్ని తత్రయాను ష్టానయజ్ఞమూర్తి ॥శరణం॥

69. ఓం పంచయజ్ఞస్తాన నిదర్శన చతుర్విధవేదాగమ ప్రభూ ॥శరణం॥

70. ఓం మహామృతఫలల ప్రసాదాధ్యాహుతి నీరాజన ప్రియా ॥శరణం॥

71. ఓం వినోదకామినీజనసులోచన నిరీక్షణ మోహనాకారా ॥శరణం॥

72. ఓం మంగళాంగన శృంగారనిజాస్తాన కళాభంగనిస్సంగా ॥శ॥

73. ఓం సౌషష్ఠీకళాక్రాంత నిశ్చింతసుచింతనా కారమూర్తీ ॥శరణం॥

74. ఓం ఆచరాచరజీవకోటి సంరక్షణ దీక్షావరప్రసాదకర్తా ॥శరణం॥

75. సంతుష్టహృదయాకాశ మహావేశ్మస్థాన నిరంతర నివాసా ॥శరణం॥

76. ఓం అశేషతను సంగ్రహా అణు స్వరూపజనప్రాప్తమే ॥శరణం॥

77. ఓం శ్రీగిరిశోత్తరదిశాగుహగహ్వరాంతర వాసమహాగురు దేవా॥శ॥

78. ఓం మార్కండేయాది మహాసంయమ స్తానగౌతమీతీరవాసా ॥శ॥

79. ఓం అశేషభూజనాతృతమధ్య మంది రాంతరనివాసనమూర్తీ ॥శ॥

80. ఓం అహర్నిశారాధనజపతపాహుతి పూజాకర్షణ సంతృప్తిదేవా ॥శ॥

81. ఓం కులనియమ నిష్ఠాగరిష్ఠాద్భుత నిదర్శనకరాబ్జప్రాణియే ॥శ॥

82. ఓం త్రికరణత్రిమల విశ్ఛేదన జనానందమందిర సునందా ॥శ॥

83. ఓం అద్భుతానందమహాగణసేవితాస్తాన గురులోకదేశికా ॥శ॥

84. ఓం పుత్రమిత్రాది సప్తగణవర్గ సంబంధకు జనవిచ్ఛేదనా ॥శ॥

85. ఓం పితృపూజాస్తాన విభేదనానంతమహాకారణ విశ్వదేవా॥శ॥

86. ఓం సర్వవేదాంతసుధాసార సంగ్రహా మహోల్లాసమూర్తీ ॥శ॥

87. ఓం అక్షీణ కరతలస్తానసుపాత్రాంతరగ్రాసభిక్షాన్న ప్రాశనా ॥శ॥

88. ఓం అనాహుతాది మహాపంచాహుతి గ్రాసార్పనవికుక్షయే ॥శ॥

89. ఓం సర్వదేవతార్చన ప్రధానకలశారాధన భావనానందా ॥శ॥

90. ఓం యోగనిదర్శనమనలోల్లాసఖేచరీ అమనస్కాచలసాధనా ॥శ॥
91. ఓం దేవబ్రాహ్మణాది మహాపంచాననకులప్రకర్షణ విశ్వైకమూర్తీ ॥శ॥
92. ఓం క్షీరశైలాంతరమయ ప్రవాస అనంత విద్యానైపుణ్య విగోచర ॥
93. ఓం మహామౌనిగణమాన వోత్తమ కులబాంధవ్య దివ్యమహామూర్తీ ॥శ॥
94. ఓం బ్రహ్మభూయిష్టాఽ ద్వైతసముద్రముద్రిత యోగ నిద్రాప్రచారా ॥శ॥
95. ఓం చందాదిత్రయమండల మధ్యప్రవాస చిత్కళా న్యాసమానసా ॥శ॥
96. ఓంఅవర్గాదిక్షవర్ణాంతర, అనాది మధ్యగతాంతరఫల కామప్రదాతా ॥శ॥
97. వీరశైవ సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్య వేదాంతనిష్ఠాగరిష్టా ॥శ॥
98. ఓం త్రిమతస్తానబేధాభేధ లక్ష్యా లక్ష్య మహామంత్రపరిష్కారా ॥శ॥
99. ఓం బాల్యాది చతుర్విధకాలజ్ఞానసగోచర స్వరూపా ॥శ॥
100. ఓం సర్వాంగా భరణభాసురానంద స్వచ్ఛవిగ్రహస్వరూపా ॥శ॥
101. ఓం నాదబిందు కళాత్రయాతీత నిరంతర నిష్ఠాగరిష్ఠా ॥శ॥
102. ఓం మహాఘోరనరక ప్రవాసదోషజన మోక్ష ప్రధాతా ॥శ॥
103. ఓం నిజాలయగర్భమయ బ్రహ్మసనాసీనదేశికా న్వయ ప్రభూ ॥
104. అగణ్యపుణ్యజనమనోనురాగానంద సుధాకరమూర్తీ ॥శ॥
105. ఓం అనంతాగ్నిజ్వాలామాలికా లంకార ఆజ్ఞేయలోచనాయ ॥శ॥
106. ఓం యిడాపింగళ సుషుమ్న నాడీ త్రీతయాస్తానమానసా ॥శ॥
107. ఓం ఆదిశంకర సంభవాతీత వంశ పావనాకారా ॥శ॥
108. ఓం హ్రీం, శ్రీం, ఐం, క్లీం, సౌః మహాదేవగురు బ్రహ్మార్పణమస్తు ॥శ॥

పార్వతీ పరమేశ్వర, విఘ్నేశ్వర, సుబ్రహ్మణ్యస్వామి పాటలు పాడుకోవచ్చును.

సనారీ మాలాధారణ కర్త : సుగంధం సాయిబాబాచార్య సిద్ధాన్తి
శ్రీశ్రీశ్రీ సనారీపీఠం స్థాపితం : 2001
శ్రీ సాయిజ్ఞాన నిలయం, వోగిరాలవారివీధి,సత్యన్నారాయణపురం,
డోర్ నెం. 23-11-1-6/బి, విజయవాడ - 11.
సెల్ : 9290582110






శ్రీశ్రీశ్రీ సనారీ విశ్వేశ్వరస్వామి పీఠాధిపతులు

పుస్తకానికి కంప్యూటర్ చేయించినవారు : క్రాప వెంకటేశ్వరరావు, తెనాలి



బ్రహ్మశ్రీ బంగారు నాగేశ్వరరావు శ్రీమతి లక్ష్మీభ్రమరాంబ